సంపుటము 5]   డిసెంబరు, 1918   [సంచిక 6

# బాలమిత్ర



## మన క్రిస్మస్ ఉత్పత్తి

క్రిస్మస్ అన్యమత పండుగలలోనుండి యుత్పత్తి ఆయెనా? ఔను, దాని మోస్తరు చూడగా అట్లున్నది. అయినను అభిప్రాయమందు అది అన్యమతము

నకు కేవలము విరుద్ధముగా నున్నది. క్రీస్తుశకమునకుముందు అనేకశతాబ్దములనుండి లోకములోని ప్రతి దేశమున్ను సంవత్సరాంతమందు ఒక ముఖ్యపండుగను ఆచరించెను. మొదటి క్రిస్మస్ ప్రతిష్ఠసాట్రు నేలియ యను పండుగ విధమును అనుసరించిన దనుటకు యే సందేహములేదు. తరువాత రాను రాను పూర్వము ఇంగ్లండు దేశములో నివసించు డ్రూయిడ్లు అను మతగురువుల ఆచార కర్మలును, పూర్వము జర్మనీ దేశస్థులయొక్కయు, స్కాండినేవియా దేశస్థుల యొక్కయు ఆచార కర్మలును యీ క్రిస్మస్‌కు కలుపబడెను. సాధ్యమైనచోట దిద్దబడుచు అన్యమతమునుండి క్రీస్తుమతమునకు వచ్చువారికి అభ్యంతరము కలుగకుండునట్లు ఈ ప్రకారముగా అన్యమత పండుగ విధములు అవలంబించబడెను. అన్యమత పండుగ విధమును పోగొట్టి క్రైస్తవమత విధమును నాటుటకు యిట్లు చేయుబడినదిగాని అన్యమత విధములను అనుసరించుటకు కాదు.



## 198 వ సంగీతము

క్రీస్తుపిల్లలారా!
సంతసంబుతో

క్రొత్తరాజుస్తుతి
లేచిపాడుఁడీ
మీరుపిల్లలెన్నను
భీతిలేకనా
యొద్ద కేసుడంచు
యేసుపిల్చెను.
ఎల్లసోదరులారా!
సంతసంబుతో
క్రొత్తరాజుస్తుతి
లేచిపాడుడీ
సుక్రిస్మస్కల్గును గాక
సభక్తులకందరికిన్
చేరియుండేసునాదన్
క్రిస్మస్వచ్చెను.

2. తల్లియామరియు
దైవశిశువుగా
నీచమైనతొట్టిగా
నిద్రపుచ్చెను
తూర్పునక్షత్రంబు
చుక్కలన్నిఁటగా

దివ్యకాంతితోడ
తేజరిల్లెను.

౪. రాజుకొఱకైన
కనకంబును
బోళముగ సాంబ్రాణి
నియ్యకున్నను
వేరుకానుకలఁగ
ఇయ్యాగలము
క్రీస్తుపిల్లలారా!
వచ్చియియ్యుడి.

౫. రత్నరాశికన్న
గర్వహీనతఁగ
పిల్లలవారిశుద్ధిఁగ
క్రీస్తుకోగను
ధరఁబుట్టినట్టి
శ్రీకరుండగు
క్రీస్తులైనయేసుఁగ
చేకొందును.

-----

# ఒక పేదకుటుంబముయొక్క క్రిస్మసు కథ

బెల్జియము దేశములో నొకానొక గ్రామము నందొక పేద కుటుంబము వాసము చేయుచుండెను. అతని కుటుంబము దేవుని సేవించుటయందు వెనుకతీయక తమ కాలమును గడుపుచుండిరి. ఎంతో దరిద్రులైనను పండుగ పబ్బములు వచ్చిన కొంచెము యెక్కువైన వంటలు చేసుకొనిగాని లేక క్రొత్త వస్త్రములను ధరించిగాని యా దినమును దక్కిన దినములకంటె కొంచె మధికముగా నాచరించెదరు. పై జెప్పిన విధమున వారికిగల దారిద్ర్యమువలన సంవత్సరము పొడుగున నష్టకష్టములు పడుచుండిరి. తండ్రి యీ స్థితిని తలంచుకొని ముందు క్రిస్మసు దినము వచ్చినపుడు యేదో యొక విధముగ బిల్లలకు క్రొత్త బట్టలను కుట్టించి ఆ దినమున తక్కిన బాలుడు బాలికలు సంతోష పడునట్లుగా వీరి తండ్రియు వీరికొక క్రిస్మసు చెట్టును వేసి వారిని కుతూహలపఱచ తలంచెను.

ఇట్లు కొలదిదినములు గడచిన తరువాత నా దరిద్రుడు భార్యబిడ్డలను వదలి ఒక దూరదేశమునకు నుద్యోగము సంపాదించుటకు వెళ్లెను. సరె తండ్రి ఇంటియందున్న సమయముననే బిడ్డలంత కష్టములు పడుచుండ, ఇప్పుడు కష్టములొందుట కొకలెక్కయా; పాపము తండ్రిపరరాజ్యవాసిగా నుంటుండగా క్రిస్మసు దినము సమీపించెను. అప్పటికి డిసెంబరు 24 వ తేది గతించి పోవుచుండెను. అయ్యో! తండ్రి యింటియందులేని యీ పేదకుటుంబము తమ తండ్రి దేశాంతరమున నుండుటయు, రేపటిదినము క్రిస్మసు అలంకార వస్తువుల లేమిని గూర్చియు తల్లియు పిల్లలును మిక్కిలిగా దలంచుకొనుచు మోకాళ్లూని సర్వేశ్వరుని యీలాగు ప్రార్థించ దొడగిరి. "పరలోకమందున్న మా తండ్రీ! మమ్ములను సంతోషపఱచు నీ యింటి యజమానుడు యెచటనున్నాడో మాకు తెలియుదు. రేపటిదినము నీ ప్రియకుమారుని జన్మదినోత్సవము ప్రపంచమందలి నీ బిడ్డలందరికిని కలుగును. తండ్రీ! అట్టి ప్రాప్తి మాకులేదు. మాతండ్రి మాయొద్ద లేకపోయినను నీవే మానిజమైనతండ్రివై యున్నావు. మమ్ములను గనికరించి ప్రపంచమందలి నీ బిడ్డలనందరిని సంతోషపఱచునట్లు మమ్ములనుకూడ సంతోషపఱచుము" అని ప్రార్థించుచుండ లోగడ దేశాంతరము వెళ్లిన తమతండ్రి

ఆ యూస్థలములయందు గొంతధనము సంపాదించుకొని, భార్య కును, పిల్లలకును గావలసిన అలంకార వస్తువులను కొనుక్కొని యొకసంచియందు భద్రముగా బదిలపఱచుకొని చాల ప్రయాసగల కాలినడకతో డిసెంబరు 24 వ తేది 8 గంటలకు దన గృహవాకిట యొద్దవచ్చి నిలిచెను. ఇంటియందొక విధమైన దీపము వెలుగుచుండెను. తల్లియు, పిల్లలు మోకాళించి పై జెప్పిన విధమున ప్రార్థించుచుండిరి. ఇట్లు ఆ యజమానుడు వాకిట నిలువబడి చూచుచు, వారు ప్రార్థన నుండి బయటకు రాగానే “అమ్మా! నేను దేశాంతరుఁడను కడువృద్ధుడను, బీదవాఁడను ఈ గ్రామసమీపమునకు వచ్చేవఱకు ప్రొద్దు గ్రుంకినది. మీ యింటివద్దకు వచ్చేవఱకు నీవేళయినది. ఇంకెటకేని పోజాలను. ఈ పూటకురవంత భోజనమనుగ్రహించిన దానితో దృప్తినొంది, యీ రాత్రి యీ పంచయందుండి రేపు నాదారిన నేబోయెద” నని వారి నడిగెను. అందుకు వారు అయ్యా! మేము నీకంటె దరిద్రులము, మా తండ్రి, యెటకో దేశాటనము వెళ్లియున్నారు మేముకూడ భోజనమునకును వస్త్రమునకును జాల యిబ్బంది పడుచున్నాము. మా యొద్ద యీపూటకే యాహారము దొరకజాలదు అయినను రేపటి చలిదికొఱకు మా తల్లికొఱకు, ఇదిగో! కొంచెము ఆహారము భద్రపఱచియున్నది. రేపటికొఱకు

దేవుడే ఆహారమును జూపించును. ప్రస్తుతము ఎక్కువ యాకలి గొనియున్నారు కనుక తిని తృప్తిపడుమని ఒకపాత్ర యందు వడ్డించి ముసలివాని కిచ్చిరి. ఆ వృద్ధుడా యాహార పాత్రను తీసికొనుచు అమ్మలారా! రేపు క్రిస్మసు దినముగదా, ఈ పురవాసులందరెచ్చట చూచినను గమగమలాడు భక్ష్యములను వండుకొనుచున్నారు. పాపము రేపటికొఱకు మీకీ చలిదియున్నదే కాబోలు! అని కన్నీరు విడుచుచు ఆ వసార యందు కూర్చుండి భక్షించి సేద తీర్చుకొని తనవృత్తాంత మీ రీతిగా జెప్పదొడగెను. నేను సంపాదనకొఱకు దేశాంతరమువెళ్లిన మీ తండ్రిని. రేపటికొఱకు మీరు విచారపడవద్దు. ఇదిగో! మీకును మీ తల్లికిని, క్రిస్మసు చెట్టుకొఱకును అలంకారములు దేవుడు నా కనుగ్రహించియున్నందున మీకు తెచ్చితినని వారికిచ్చెను. అప్పుడా యింటివారందరు సంతసించి దేవునికి స్తోత్రములు చెల్లించి క్రిస్మసు దినమందు అందరితోపాటుగా మిక్కిలి ఆనంద భరితులైరి.

కనుక నీ పేదకుటుంబమును దేవుడెంతగా నాశీర్వదించెనో అలాగే మనమును మన ప్రభువైన క్రీస్తును ఎడతెగక విశ్వాసముతో ప్రార్థించిన, ఆయన అక్కరలను దీర్చును.



# బాలికా విషయములు



రాజును దీవించుమని దేవుని వేడుట

ఇంగ్లీషు రాగము

దేవా మా రాజును-దీర్ఘాయు విచ్చుచు-దీవించుము
కేవల జయము-కీర్తి ప్రఖ్యాతియు
కర్త యొసంగుచు-కాపాడుము. 1

మా రాజున్ వైరుల - నిరోధ కుట్రలు - హరించుము
అత్యంత నెమ్మియు - నిత్య వైభవము
సత్యపాలనము - స్వామి యిమ్ము. 2
నీ యాశీర్వాదముల్ - నింపార రాజుపై - నిండించుము
నిడివి రాజ్యమున్ - నెగడు నీతియున్
నెన్నిక నిచ్చుచు - మన్నింపుము. 3

---

# ఒక చిన్నబిడ్డ నమ్మకము

ఒకబిడ్డ తండ్రి సైన్యములోనుండి యుద్ధమునకు బోయెను. కొన్ని సంవత్సరములైనపిదప అతడు చంపబడినటుల తల్లికి కబురు దెలిసెను. ఆమెకు ఇద్దరు బిడ్డలు. ఆ కబురు వచ్చిన రెండుమూడుదినములకు ఇంటి ఆసామివచ్చి అద్దె చెల్లించుమని యడిగెను. అతనికిచ్చుట కామెయొద్ద చిన్న కాసైనను లేకపోయెను. ఎక్కడనుండి తెచ్చియిచ్చుటకైనను తోచలేదు. గాన నిర్ఘాంతపడి చూచుచుండెను. అంతట వాడు అద్దెయియ్యక పోయినయెడల వారు లేచి వెళ్లవలసియున్న

దని కఠినముగాబలికి వెళ్లిపోయెను. ఆమెకు కుట్టుపనితప్ప మరేదియు రాదు. చలికాలము సమీపించుచుండెను. అతడు వెళ్లినపిదప ఆమె కుర్చీమీదపడి యేడ్వనారంభించెను. అప్పుడు నాలుగేండ్ల ప్రాయముగల ఆమె చిన్నకుమారుడు ఆమె యొద్దకుబోయి,

“అమ్మా! మనమడిగినవానిని దేవుడియ్యాడా?” అని యడిగెను.

“విశ్వాసముతో అడిగితే ఇచ్చును”

“మనకిల్లుఉంటే మంచిదికాదా?”

“ఎందుకు మంచిదికాదు?”

“నేను ఆయనను అడుగవచ్చునా?”

“నీకిష్టముంటే అడుగవచ్చును.

అంతటతడు వెళ్లి మోకాళించి ఇట్లు ప్రార్థించెను.

“ఓ దేవా! నీవువచ్చి మాతండ్రిని తీసికొనిపోతివి. ఇంటి అద్దె చెల్లించుటకు అమ్మవద్ద ఏమియులేదు. అతనికియ్యకపోతే ఆసామి మమ్మును వెళ్లగొట్టును. మేము ఎవరి పంచలోనైన పడి యుండిన చలికి చచ్చిపోదుము. గనుక మేము కాపురముండుట కొరక ఇంటిని మాకు చూపవా?” అని ప్రార్థించి కొంచెమాగి

దేవుడా! దయచేసి మాకొక ఇంటిని ఇయ్యవలసినదని లేచి తల్లియొద్దకువచ్చి "అమ్మా! ఇక నేడ్వవద్దు దేవుడు మనకు ఇల్లు ఇచ్చును అని చెప్పెను.

కొందరు క్రైస్తవసహోదరులు ఈ సంగతివిని చందాలు వేసికొని, అప్పటినుండి ఆ యింటిఅద్దెను వారు చెల్లించిరి.

చిన్నిబిడ్డ నమ్మక మెంతపనిచేసెనో చూడుడి.

---

## అమ్మా! ఎక్కడున్నావే

ఒ డినిపడి చియిల్లు - పడిగ జేరినగాని
అమ్మనపుడెజూడ - పలెను తాను
లేని యెడలనాట - వేటులైనబోనిమ్ము
"అమ్మ! ఎక్కడున్న - దనునుబిడ్డ. ఆ. వె.

తే. గీ. బిడ్డలందరు తమమాత - బిలిచినపుడు
బలుకకుండినవెంటనే - బావురనుచు

ఏదియోమున్గి తమపైకి - యెగిరివచ్చి
నట్లు "ఎచటనే అమ్మరా?" - యాంధ్రభువిని.

తే. గీ. ఎందుకోగాని యింటిలో - నేమిలేని
యట్లుండును లేకున్న - అమ్మయింట
అమ్మబిలికిన యెడలనే - యన్నిపనులు
జరుగుచున్నట్లుండు - దెరుగజాల.

---

## మంచి యారంభము

ఒకానొక రైలులో నొకగార్డు టిక్కెట్లుచూచుచు ఒక పిల్ల యొద్దకు వచ్చెను. "టికెట్" అనగానే ఆ పిల్ల "అమ్మదగ్గర నున్నది. ఆమె నీళ్లు త్రాగుటకు పోయినది. దయచేసి యీ నారింజపండును తీసికొనిపోయి ఆ చివరనున్న పిల్లకు యిస్తావా? పాపము వారు ఆమె కియ్యుటకు మరచిపోయిరని చెప్పెను. అప్పుడాగార్డు ఆ కాయను తీసికొని అక్కడకుపోగా ఒక బీదస్త్రీ అయిదుగురు బిడ్డలతో ప్రయాణము చేయుచుండుట కనబడెను. వారికి తినుట కేమియులేదు కదా బిడ్డలును బల హీనముగా నుండిరి. అప్పుడతడు దానిని తీసికొనిపోయి, బిగ్గరగా "ఇదిగో ఒక మంచిపిల్ల యీ నారింజపండును మీకు

పంపినది. ఆమె తల్లికూడా యిది మీ కామె యిచ్చుటకు యిష్టపడినదని చెప్పెను. చుట్టునున్నవా రీ మాటలువిని అటు చూచిరి. వెంటనే వారా బిడ్డలున్న దరిద్రస్థితినిచూచి, కనికరించి వారికి తలాయొకటి తను కిష్టమైనది యిచ్చిరి. అట్లా చిన్నబిడ్డచేసిన మంచిపని యెంతో ఆశీర్వాదకరముగా ముగిసినది.

---

## బాలమిత్ర టపా

ప్రియబాలమిత్రులారా!

బాలమిత్రటపాకు ఒక ఉత్తరము వ్రాయవలెనని నాకు చాలాకాలమునుండి కోరికయై యున్నది. నాకోరిక ఇప్పుడు నెరవేరినది. ప్రియస్నేహితులైన మీకు నేను వ్రాసే దేమనగా:—నేను ఇప్పుడు గుంటూరునందుండు ఎ.ఇ.యల్.యం (పాఠశాలలో) బోర్డింగులో చదువుకొనుచున్నాను. నేను ఇప్పుడు నాలుగవతరగతి, నాకు ఇప్పుడు 10 సంవత్సరములు. మాతల్లికి మేము ఐదుగురము. వారిలో ఇద్దరు మొగవారు




ముగ్గురము ఆడువారము. గాని, మేము చిన్నవారముగానున్న
ప్పుడే మాతండ్రి ప్రభువునందు నిద్రించియున్నాడు. అయినను
దేవుడు మమ్ములనింతవరకు సుఖముగానే కాపాడుచున్నాడు.
మా బీదకుటుంబముకొరకు మీరందరు ప్రార్థించండి. మిత్రు
లారా! మా బోర్డింగును 5 భాగములుగాచేసి ఒక్కొక్కదాని
కొక్కొక్కపేరు పెట్టినారు (1) ప్రేమ, (2) సమాధానము,
(3) ఆనందము, (4) నిరీక్షణ, (5) కృప, అను మందిరములు.
నేను ఇప్పుడు సమాధానమందిరములో యున్నాను. దినము
లన్నియు సంతోషముగా గడుపుచున్నాము. మా మిశమ్మ
గారు ప్రతి మంగళవారము మత్తయిపదార్థమునుగూర్చి బోధిం

చెదరు మమ్ములను దయతో చూచెదరు. స్నేహితులారా! మీరు దేవుని మరువకుడీ ఆయన మిమ్ములను కాపాడును. నేను ఒక సంగతి చెప్పెదను ఒకనాటిరాత్రి సమాధాన మందిరపు పిల్లలమును మేమందరము పరుండియుండగా నడురాత్రిలో బట్టు కమలమునగు నేనును నిద్రించియుంటిని. ఆ సమయమున ఒక పాము నా రొమ్ముమీద పరుండియున్నది. అది పరుండినసంగతి నాకు తెలియదు. నాతో ఒకపిల్ల బైటికి వెళ్లుటకు నన్ను లేపగా ఆ పాము నాముఖముమీదుగా ప్రాకి నా ప్రక్క క్రింద పరుండినది. దానినిచూచి భయముచే పిల్లలందరు అరచిరిగాని నేను ఇంకను లేవలేదు. తరువాత నన్ను లేపిరి. నేను దానినిచూచి భయపడితిని. తరవాత దానిని చంపిరి. స్నేహితులారా, చూచితిరా దేవునికి ఎంత ప్రేమ!

ఇంతే సంగతులు, మీ యందరికి నా వందనములు.

ఇట్లు

మీ ప్రియ బాలమిత్రురాలు

బట్టు కమలమ్మ

గుంటూరు బోర్డింగు

C. L. S. PRESS, MADRAS—1918